చాళియమేళం - శంకరాభరణం
జతిస్వరనటనం - చరణచారణం
మేధాసకలం - గ్రీవాభేదం
జాతిచతుశ్రమ - కుచేలచాపలం.

## జతిస్వరం-చారమానం 13వ మేళకర్త-త్రిపుటతాళం

ఆరోహణ
దాందాం - తకదికితక - తతోంతదోద్దో
అవరోహణ
దందందాం - దికితక - తతోంతదోద్దో
దీందికితక - దోద్దోదీందా
దీందాకిట-దొద్దోదీందా ॥ఇదిపల్లవి

అ॥వ॥ దం దం - దందం - దందాం౦
దిందిం - దిందిం - దీం దీం౦
తద్దికితక - తాహతకిటతక
తకధికితక - తకదదిగిణతోం ॥ధింధికి॥

## నీలాంబరిగీతం - త్రిపుటతాళం

అ శు చ కై
స రి గ మ ప ద ప ని స - స ని ప మ గ రి గ స
సారిరిసనీ - సగగమాగమ
దాందదాందద - దాందదాం - కిటతక
రిగరిమా..మగగసాస
దీందదీందద - దీందదీం౦
సపపాప - ధపమపమగా
తోదిగిదందందాం-తోదిగిదిందిందీం

మపామపమగ - గరిమగాసా
దాందికితక - తతోంతదొద్దో
సాససా..సనిపపమమగ
దందందాం-దికితకతతోంతదొద్దో
గామపదపమ - పమగరిమపూ
దాందికితక - దందందాందికితక
గిరిమగాగస - ససరిరిసనీ
దాంధికితక - దద్దీంగిణతొం-
సగగమాగమ - గమపపాపా
ధీగుణాంగు - తాహతకిటతక
మగమపనిదని - పదపపమమగ
ధిత్తళంగు - ధిత్తళంగుతోం
పమగ - రిమగస - సనిపపమమగ
తరికుణాంగుతాహతకిటతక
గరిమగాసా..నిసరిగమగమ
ధిత్తళంగుధిత్తళంగుతోం
గమపమపసా - సనిపపమమగ
ధీగుణాంగుతాహతకిటతక
పమగరిమగస - సనిపపమమగ
తరికుణాంగు - తాహతకిటతక
గరిమగాసా
తకదదిగిణత **లేక** దద్దింగిణత ॥ధీంధికి॥
చారమానం - త్రిపుటతాళం
జతిస్వరం - నీలాంబరిరాగం
సప్తాక్షరం - సప్తస్వరాకారం
నటేశం - చిదంబరేశం

## నత్రము 14వ మేళకర్త-ఆట-చాపు

ఆరోహణ

తాధిమిద్ధిమి - ధిమిధిమిద్ధిమి

అవరోహణ

తధిక్కు - తధిక్కుతాం

తతై తై - తెహిదత్తతాం

తాతా తై-తెహిదత్తతాం ॥ఇదిపల్లవి

ప్రా॥అ॥ తాధిమిద్ధిమి - ధిమిధిమిద్ధిమి

తత ధికుకుకు — ధికుకుతత్త

తద్ధితకఝుణుతాం-ధి తకఝుణుతాం-తకఝుణుతాం ॥తతై తై॥

## భైరవి-ఆటచాపు-కామాక్షీ స్వరజతి

చసాళు ళుక్లై

జతిస్వరం :- భైరవి-సరిగమపదనిస - సనిదపమగరిస

గామగరిసరి - నీసనిసరిగ

తద్దిమీంధిమి - తహతఝుంతరి

మాప్పగరిగమ - పాదమగరిస

ఝుంతజగదరి - జగదకుకుందరి

నీసనీగారి - గామాపద

కుకుంద - తకుందదరి - తకుందకిణధరి

నినీదపా - పామాగరిస

తాంooo తెహిదత్తతాం ॥తతై తై॥

ఖండ —చాపు

2. మాపనిద - మాపనిద - మాపదపమా

తద్దిమిత - తద్ధిమిత - తద్ధిమితతాం

గామపా - గామపా - గమపా
తహధణత - తహధణత - తహధణతతాం
పమగిరీ - నిసరీ - నిసరీ
తాహంత - కిటతక - ఝుంతతాం
నిసరిగా - పాదనీదనిదపా
కిటతకతరికిటతక-కిటతకతరికిటతకతాం
సనిదపా - పాప్పమగరీ
తాధిమ్మి-కిటతకతరికిటతకతాం ॥తత్తై॥

## తిశ్రంచాపు

దపదా - పదనీ - దనిసా - నిసరీ
తకిట - దికిట - తొంగిట - నంగిట
నరిగా-మగరీ - గరిసా - రిసనీ
తద్ధిమ్మి - తద్ధిమ్మి - తాహత్తధిన్నాం
దనిదా - పదపా - ధపమా - పమగా
కత్తరిడి - కత్తరిడి - కాహురే - కాహురే
మగసా - సరీగమా - రిగామపా - గమాపదా
తకిట-తకిట-దధీంగిణతొం-తధీంగిణతొం-తధీంగిణతొం ॥తత్తై॥
నక్షత్రం-మేళకర్త్రం-సప్తసూత్రం-చారిత్రం
గానమాధురీనీవకర్త్రం-జతిస్వరలక్ష్యసూత్రం
కూచిపూడినృత్యశాస్త్రం-అఖిలభారతసన్మిత్రం
వేదాన్తవార్ధిచంద్రం-పార్వతీశం హరితసగోత్రం

2-11-1990 End-

# నాట్య ద్వాదశాంగములు

—భరత కల్పలతామంజరి—

భరతశబ్ద ప్రస్తారమునకు సప్తసూత్రములు—

తద్ధి-తోనం-కిటతక-దిరిగిణ-ధరికుం-ఝుం-హం

శ్లో॥ పీఠికం ప్రథమంతేషాం-ద్వితీయం కౌతమేవచ
తృతీయం కూటమానంచ-చతుర్థం కైయడుస్తథా
పంచమంతురుపుఃప్రోక్తం - షష్టంచకళాసికా
సప్తమం ప్రచురంచైవ-అష్టమం వసరం తథా
నవమం శబ్దకంశ్చైవా - దశమంతుమరాళకం
రుద్రం కడకట్టుశ్చైవా-చాళీయం ద్వాదశం తథా
నాట్యేషు ద్వాదశాంగాని-ప్రయోక్తవ్యానిసూరిభిః.

## 1. పీఠిక లక్షణము

శ్లో॥ తదాక్షరేణ సంయుక్త-స్థాదిగిద్ధిగి-రేవచ
ఆదౌతు సమపాదశ్చ-హస్తశ్చతులదాభిదః
సమం శిరస్సమాదృష్టిః - పీఠికంచాభిధీయతే ॥

## 2. కౌత లక్షణము

శ్లో॥ పాతాక్షరేణసంయుక్తం - దేవతా విషయాత్మకం
నానార్థచిత్ర సంయుక్తం - కీర్త్యాంతం కౌతముచ్యతే॥

## 3. కూటమానలక్షణం

శ్లో॥ ధిర్రక్కకదంచాదౌ - ధీగుణాంగంతు మధ్యమే
కూటమానమిదం ప్రోక్తం - పాతాక్షర విచక్షణైః

## 4. కైయ్యాడు

శ్లో॥ కైయడ్వాదిస్తు - తక్కృత్తా - ధిక్కృత్తా - ధిగతేధిచ
శిరోభేదసమాయుక్త - దృష్టిస్థానక సంయుతః
నృత్తహస్తానుగామీచ - పాదచార్యస్తుకైయ్యాడుః

## 5. తురుపుః

శ్లో॥ తత్తా దిత్తాతు పూర్వంతు - దందం - దింద్యాది - మధ్యమే
యేవం పాఠాక్షరం యత్నసనామ్నాతు - తురుపుద్భవేత్

## 6. కళాసిక

శ్లో॥ ఝంకారాదిస్వరైశ్లిషం - దీర్ఘకైర్వాక్షరైర్యుతం
ప్రాయేణ దృశ్యతే యత్ర - కీర్తితాసా కళాసికా.

## 7. ప్రచుర

శ్లో॥ తాహత ఝంతరి తళబ్దశ్చ - కుందరితమేవచ
యేతశ్శబ్ద సమాయుక్తం - ప్రచురం నామకీర్తితం

## 8. వసర

శ్లో॥ ఝంతద్వయాక్షరాణ్యాదౌ - ధణకుద్ధణ మధ్యమే
ఇదంతు వసరం నామ - ప్రోచ్యతే పూర్వ సూరిభిః

## 9. శబ్ద

శ్లో॥ యేభిర్వర్ణైస్సమైర్హస్తై - శ్లిష్టవాన్యత్ర నిర్మితః
తద్ధంగణాది - శబ్దోంతే - సశబ్దః పరికీర్తితః

## 10. మరాళ

శ్లో॥ ప్రథమందుగ్గదిగ్గస్యాదంతే - ధోంగుడు–ధోంగుడుః
ధీంతకిటధణం - మధ్యేమరాళస్తు ప్రకీర్తితః

## 11. కడకటు

శ్లో॥ ప్రాయేణ శ్లిష్టవర్ణశ్చ - దీందకాది సమన్వితః
ఆదిమధ్యావసానేషు - తవర్ణోంతేచబంధకః

## 12. చాళీయం

శ్లో॥ రేఖానుమాన గాంభీర్యం - తత్ర తాళలయాన్వితం
ఊరోకటి శిరోపాంగం- కోమలం యదిచాలయేత్
అర్ధాచ్చాళీయకశ్చాద–చాళీహస్తయతోయది.

## చారమానము

శ్లో॥ స్వరసంశ్లిష్ట సంపూర్ణం - దాందాం వర్ణకృతోభవేత్
ఆదమధ్యావసానేషు - చారమానోభిధీయతే.

## నత్రము

శ్లో॥ తాద్ధిమిద్ధిమ్మివర్ణంతు - తధిక్కటమేవచ
నామ్నాతునత్రమిత్యేవ - ముచ్యతే పూర్వసూరిభిః.

ఆ॥ గొల్లకాటివాడు గోపాలకృష్ణుండు
పార్వతీశుడనగ వానిసఖుడు
గొల్లకాపు పనిని గోపాలుడేసేయ
పార్వతీశుడనిన పలచనేల ॥

క॥ వరదయ్య గొల్లకాపరి
వరవడి శ్రీపార్వతీశ వసులను గాయున్
తరతమ క్షేత్రయ్య కవులు
సరసపద కవిత హృదిసరసాలాడించున్ ॥

సీ॥ దుక్కిముచ్చని వెక్కిరింతువు నను గని
మట్టి దున్నినే పెకలింతు మణులపంట

ఆ వృకోదరులను పండితాళిజేతు
ప్రౌఢిపోతన్న వాదు వో పార్వతీశ ॥

సీ॥ పార్వతీశుడవీవు - పార్వతీశుడనేఁ
గొప్పయేమియులేదు దెప్పదలచ
నీవు నాట్యముజేయ నేను నాట్యముజేతు
గొప్పయేమియులేదు దెప్పదలచ
సంగీత ప్రియుడవు సంగీత ప్రియుడను
గొప్పయేమియులేదు దెప్పదలచ
సురలు మీరైతె భూసురుడనేనౌదుఁ
గొప్పయేమియులేదు దెప్పదలచ

గీ॥ చెమిటి మల్లయ్యవని బిల్వ చెమిటివాడ
నేను-ఒక్కటే తరుగాయె నీకు నాకు
భేదమేలేదు - సుంతైన - వృత్తులందు
యెట్లుగా చెదోనటరాజ యిపుడు నెపుడు ॥

గీ॥ కవినిగాదు - నృత్యకవిని - గద్యరచన
యంచనకురనేనే పద్యమైన వ్రాయ
గలను - పూరించెద సమతూకమున తరుగు
లనుచు-నృత్యవాచస్పతి యంచురయ్య ॥

## వినాయక తాండవం - తిశ్రత్రిపుటతాళం

## చారమానం 13వ మేళకర్త-కాంభోజిరాగం

ఆరోహణ

దాందాం-తకధికితక-తతోంతదొద్దో

అవరోహణ

దందందాం-ధికతక-తతోంతదొద్దో

తాంంతతై-తతై- 4సార్లు-భంగిమలు చూపించు

ధోగుడుదొద్దోకిటతక-దొద్దోకిటతక-దొద్దోకిటతక - 2సార్లు
దోగుడదొద్దోకిటతక-దద్దింగిణతొం – 3సార్లు
దోద్దొ దీందాం–దొదొదొదీందాం
తద్దికితక-తాహతకిటతక
తకధికితక – తకదదిగిణతొం
ధీగుణాంగు – తాహతకిటతక
ధిత్తళంగు - ధిత్తళంగుతొం
తరికుణాంగుతాహతకిటతక
ధిత్తళంగు - ధితళంగుతోం
ధీగుణాంగుతాహతకిటతక
తరికుణాంగుతాహతకిటతక
ధీగుణాంగు-తకదదిగిణత-
రారనా..బంగారు – పాపా..
రారనా..లోకైక - దీపా... । రార॥

అ॥ప॥ గజ్జలందెలు - ఘల్లన[మోయ
పజ్జకురారనా-బంగారుబొజ్జ ॥రార॥
తొంగుడు - తాధా కిటతక – తతోంతతోం - 2సార్లు
తొంగుడు-తాధాకిటతక-తతోంత-నన్నకిటతక
తొంగుడు-తాధాకిటతక-తొంగుడుతక-తధీంగిణతొం
నాట్యకారుడు నీతండ్రి
లాస్యకారిణి నీతల్లి
నాట్యలాస్యపు నటనజూపి
పాటబాడర బంగారుబొజ్జ ॥రార॥
దందం-దందం-దందాం౦
దిందిం-దిందిం-దిందీం౦
తద్దికితకతాహతకిటతక
తకధికితక-తొంగ్డుతక-తధీంగిణత

నవరసాలంకారవార్ధి
నాట్యవేదపుకోటయా శ్రీ
కూచిపూడీ పూచుసుతుడ
కోమలాంగానాకూర్మితనయా ॥రార॥

దాంద-దాందద-దాందదాం
కిటతక-దీందదీందద-దీందదీం
తోదిగి-దందందాం-తోదిగిదిందిందీం
దాందికితక-తతోంతదొద్దో
దందందాం-దికితక-తతోంతదొద్దో
దాందికితక-దందందాం-దికితక
దాంధికితక-తకధికు-తధీంగిణత
... ....నవరసాలంకారవార్ధి........

సూత్రధారి నట్యాంగం పార్వతి :- నర్తకుడు వినాయకుడు.
నవరసాలంకారవార్ధిని-పల్లవిజేశి-స్వరంవేస్తూ పాడిన ఆడండి-
మృదంగంకూడా-తని-వాయిస్తే ఆడండి-
శివకామిని-కురంజిరాగం

కా చ అ శు చ
రచన :- ఘనంసీనయ్య- స ని స రి గ మ వ ద-ద వ మ గ రి స ని స
శివదీక్షాపరురాలనురా-అఅఅఅనే
శీలమింతైన విడువ-జాలనురా అఅఅఅఅ ॥శివ॥

అ॥ప॥ శివశివ గురునాజ్ఞ-మీరనురా........
శ్రీవైష్ణవుడంటే-చేరనురా........ ॥శివ॥

1. వడిగావచ్చి మఠము-జొరవకురా....
శివార్చనవేళ-తలుపుదెరవకురా
ముదవకావిచెరగు-దీయకురా....నీవు
మాటిమాటికి-నోరుముయ్యకురా.... ॥శివ॥

2. పంచాక్షరీజప-శీలనురా....
కూకిపలుకులను - వినజాలనురా....
కొంచెపు వగలు నే- నెంచనురా....
మ్రొక్కుదు రుద్రాక్షసరులు - తెంచకురా ॥శివ॥

3. అజ్జుంచి వక్షము నంటకురా-నా
సెజ్జగొలుసుబట్టి-కదియకురా
బుజ్జగించను పసిగోలనురా....
కెమ్మోవినొక్కకు భక్తురాలనురా... ॥శివ॥

4. మోము మోముబట్టి చేర్చకురా...నీ
నామముతోడ బూదిగూర్చకురా...
వేమరుతొరద భిక్ష వేడకురా....
పోపోరమన్నారు రంగ-మల్లాడకురా ॥శివ॥

# ఫేరణి-వాహ్యాళి-

## లోకక్షేమం వహామ్యహం

### -: స్రగ్ధర :-

లోకానాహూయసర్వాన్-డమరుకనినదైః- ఘోర సంసార మగ్నాన్
దత్వాభీతింతయాళుః-ప్రణుతభయహరం-కుంచితం పాదపద్మం
ఉద్ధృత్యేజం-విముక్తేరయనమితి-కరార్థర్మయ ప్రత్యయార్థం
బిభ్రద్వహ్నిం సభాయాం-కలయతినటనం-యస్సపాయాన్న టేశః

### ఫీరిక మేళకర్త-బ్రహ్మతాళం

ఆరోహణ అవరోహణ

తాదిగిదిగితై - తత్తహత్తై

అ శు చ కై

నీలాంబరిరాగం :- స రి గ మ ప ద ప ని స-స ని ప మ గ రి గ స

తాదిగిదిగితై-తితి తై
తితెదత తి-దతతాహం
దతానుతకిట-కిణతొంగ
డికుతొంతొంగ-
నంగిటకిటతక-నంగిటకిటతక-నంగిటకిటతకదీంద
నుతకిటగిణతొంగ-డికుతొంతొంగ
తాహంఘి-తంఘిక్కిటతక-దిక్కిత్తా
తత్తాద్రుగుడుదందం-దిక్కుందరి
దిక్కిటకిటతక-దిక్కుతొంగ-నంగిటకిటతకః

1. ఓయి వోయి జంగమా-ఓంకారలింగమా

నాణ్యమైనా జంగమా–నా ప్రాణలింగమా ॥ఓయి॥
తత్త దిద్దితొంతోనన్న–ఖాఖా–ఫాఫా–
ద్రుగుడు–ద్రుగుడు. ద్రుగుడుదాం–త్రి రః–ఖాఖా–ఫా ఫా–
తాకుృ–ధీకుృ–తక్కిృట–తొంగిటకిటతక
ఢే..ణ..తంఘిక్కిృటతక–ధిక్కిృత్త

2. ఎత్తుకాలు గిత్త నెక్కి – అట్టెతిరుగు జంగమ
బిచ్చమెత్తువాడవాడ–భీమశంకరలింగమా ॥ఓయి॥
తద్దిత్తాహతఝం. ధిత్తాహతఝం
తాహతఝం –తఝం
తత్త కిట–దధీంగిణత–ధిత్త కిటదధీంగిణత
తకిట–దధీంగిణత
భల్లనారాయణకే ముద్దు–పట్టెలెన జంగమ
చల్లంగ పాలింపుమయ్య–కోటిలింగమా ॥ఓయి॥

త్రిశ్రం:–తద్ధిమిత–తద్ధిమిత–తహధణతతాం
తత్త రికిటతక–తత్త రికిటతక–తత్త రికిటతకతాం
తాదిన్నతై–తద్దిన్నతై
తాదిన్న–తకదిన్న–తకదిన్నతై

4. కాశిలో ప్రవాసమైన విశ్వేశ్వరలింగమా
కావవయ్యా ద్రాక్షారామ–భీమేశలింగమా ॥ఓయి॥
తద్దితతఝణుతాంత–ధిత్త తఝణుతాంత–తఝణుతాంత
తకధికు–తధీంగిణత—3సార్లు

5. వెండికొండమీదనుండు–కొండపీటిజంగమా
తోడునీడవె కూచిపూడిని–రామలింగమా ॥ఓయి॥
తాదిగిదిగి–తాదిగిదిగి–తాదిగిదిగితా
తత్త దిగిదిగి – తత్త దిగిదిగి–తత్త దిగిదిగితై
తాదిగిదిగితా–తత్త దిగిదిగితై
దద్ధింంగిణాతొం— 3సార్లు

6. శ్రీశైల క్షేత్రమందు—శ్రీగిరి భ్రమరీ
నల్లమల అడవులలో చెమిటి
మల్లికార్జున లింగమా ॥ఓయి॥

తిశ్రం:– తద్దిమ్మి–తద్దిమ్మి–తాహత్తధిన్నాం
తత రికిటతక–తత్త రికిటతట–తత రికిటతకధిన్నాం
తద్దిమ్మిధిన్నాం-తాహత్త ధిన్నాం
తద్దిమ్మి-తధీంగిణతోం–తధీంగిణతోం–తధీంగిణతోం ॥

7. శ్రీ–కాళహస్తి–దక్షిణకాశీ-స్వర్ణముఖి తటినీవాస
(తక) శ్రీకాళహస్తీమూర్తి- వాయులింగమజంగమా ॥ఓయి॥
తాంంంధీత్త కిటఝుణుతాం–దదిగిణత–దదిగిణత-దదిగిణత

8. సేతుబంధన సైకతమూర్తి–ధనుష్కోటితటినీవాస
సీతారామాస్థాపిత–ధూర్జటి-రామేశాలింగమా ॥ఓయి॥
ఖండం :- తద్దిమ్మి–తద్దిమ్మి–తాతకిటతకతకిట—— 2సార్లు
తాంత-తఝుణు–తకదికి తతఝుణు—— 2సార్లు
తకదికితతఝుణుతొం—— 3సార్లు

9. మహానందీజలోద్భవాకృతి
నల్లమల అటవీ నివాస
మహాఋద్రా ఛిద్రలింగమ
కామేశ్వరీ హృదయజంగమ ॥ఓయి॥
(తకఝుణు) కిటతకదదిగిణత – తకదదిగిణత – దదిగిణత–
ధిగిణత – గిణత

## శ్రీ-కాళహస్తి దక్షిణకాశి

## పేరణీ–ఆనందతాండవం

శ్లో॥ బ్రహ్మతాళధరో–హరిశ్చపటహీ–వీణాకరోభారతి
వంశజ్ఞా–శశి–భాస్కరౌ-శృతిధరా–స్సిద్ధాప్సరో కిన్నరాః

నందీ భృంగి-రిటాద మర్దళధరాః సంగీతకో నారదః
శంభోనృత్తకరస్య-మంగళతనోః నాట్యం సదాపాతునః

## ఋద్రలయలు

1. సర్వోవై ఋద్రస్తస్మైరుద్రాయ నమోఅస్తు
2. పురుషోవై ఋద్రన్మహో నమోనమః
3. విశ్వభూతం భువనం చిత్రం బహుధా
జాతం జాయమానంచయత్
సర్వోహేష ఋద్రస్తస్మై ఋద్రాయ
నమో అస్తు ఋద్రాయ నమో అస్తు
(మధ్యమధ్యలో డమరుకం-శంఖం-గ్యాంగు-మ్రోగించాలి)

## చారమానం 13వ మేళకర్త

ఆరోహణ

దాందాం-తకధికితక-తతోంతదొద్దో

అవరోహణ

దందందాం-దికితక-తతోంతదొద్దో

కామవర్ధని - జంపెతాళం - చాపు

ధీం-ధీంంత-తరికిటతక-తధీంంత-2 సార్లు

తద్దిం-తధీం-తధీం-తధీం—2సార్లు

ధీంం-తకిట-ధీంం తకిట-తద్దింం—2సార్లు

తఝుంత తక-తద్దీంంగిణతోం—3సార్లు

రావయ్య రజితాంద్రివాసా

నవరసాలంకారభాష ॥రావయ్య॥

అ॥ప॥ పేరణీ నృత్తాల తాండవాలోలా ॥రావయ్య॥

తాద్రుగుడుజం నగజం తధిమితతా

తద్రుగుడుజం నగజం తధిమితతా

తధిమితతా తధిమిత దధిమితతా
తదిమిత తత్తకిటతక తదిగిణతోం

1. ఆనందతాండవాలోలా
ఆకాశభూచారీ కరణాలవాలా
హరిహయాదులుపాడ
అపస్మారుడట వెలసె ॥రావయ్య॥
తాకిటతక-డెగడెగ-తళంగుతోం
తత్తకిటతక-డెగడెగ-తళంగుతో
తళంగుతోం-తళంగు తళంగుతోం—2సార్లు
తళంగు తత్తకిటతక-దదిగిణతోం

2. నృత్తాలహస్తాలఖేలా
లొలికింకిణీ ఋుద్రలయలా
సంకీర్ణ శతతాళ గతులా
గంగావతరణాది కరణాలమేళా ॥రావయ్య॥
తాం - తా - తై - తై
తై - తై - దత్త
తోదిగిదాం-తోదిగి-దందందాం
దాం-దందం-దందందాం
దందం తకదికితక-తకదదిగిణతోం
తోదిగిదీం-తోదిగి-దిందిందీం
దీం-దిందిం-దిందిందీం
దిందిం-తకదికితక-తకదదిగిణతోం
తోదిగిదాం-తోదిగిదందందాం
తోదిగిదీం-తోదిగి-దిందిందీం
తోదిగి - దాందాం
తోదిగి-దీందీం
తోదిగిదాం
తోదిగిదీం

దాందాం-తకదికితక-తతోంతదొద్దో
దందందాం-తకదికితక-తతోంతదొద్దో
దాందాం-తకదికితక
దందందాం-తకదికితక
తోంగ్దుతక-తధింగిణతొం

3. వ్యత్యస్త పాదానుఖేలా
అగ్రతలసంచారా
కుంచితా అంచితా
ఘట్టితా-మర్దితా-తలాహతి ॥రావయ్య॥
తద్ధితాహతఝంతరి
ధితాహతఝంతరి
తాహతఝంతరి
తాంతతై-తెయ్యిత్త-తత్తై-తాతెహిత
తాంతతై-తెయిత్త-తత్తై
తతైహిత—త్రిసార్లు

4. ఆలీఢ ప్రత్యాలీఢ-మండలా
అభుగ్న నిర్భుగ్న ప్రకంపితా
వైష్ణవ సమపాద భ్రమరి
కూచిపూడి రామేశ రామలింగేశ ॥రావయ్య॥
ధీక్లాంకిటతక-ధరికిటధా
ధిరుగుడుక్లాం-కిటతక-తరికిటధా
ధీక్లాంకిటతకతరికిట
క్లాంగుదిన్నత్త—త్రిసార్లు

## చిన్ననాటి-ఫెరణి శివతాండవం విద్యార్థిగా

## మోహన-బ్రహ్మతాళం

శ్లో॥ ఏకాస్యంతు చతుర్భుజం త్రినయనం
వామేతు దుష్టూరగం

చంద్రం వత్రశిఖి ప్రసారితకరం
ఊర్ధ్వంపదంకుంచితం
సర్వేస్వస్తికమండలం-డమరుకం
గంగేజటేబిభ్రతం
వందేకీర్ణజటాన్నటేశ-అనిశా
పస్మారదేహేస్థితం

స.గ.ప.గ - సా - సా
స.గ.ప.ద - గా - గా
గ.ప.ద.స - దా - దా
ప.ద.స.గ - సా - సా

సా.దపదపగరి-గా....రిస-రిగపద (ప్రథమకాలం 1 సారి 2వ కాలం 2సార్లు 3వ కాలం 4 సార్లు)
దపాగరిసా-దపాగరిసా-దపాగరిసా-రిగరిగపదా—2సార్లు
సదరిసా-దపదపా-గరిగపద—2సార్లు
దపగపగరి-గరి-గరి-సదరిగపద—2సార్లు
సాదసా-గపదాగపా—2సార్లు
సాపదసా-పదసా-దపగరి-గపదాపగరి—గపగా-సరీస—3సార్లు
పదపా-గరిగపా-రిగపద-పదసా-దపదసా-దపగరిస—2సార్లు
సరీగపా-దపదస-దపదా—3సార్లు
సాదాపా-సదపగరిసా—3సార్లు
దపదా-పదసగా-రిగరిసద-రిసరీ-రిసదసా-సారిగప—2సార్లు
దాదరిసా-దాదరిసా-రిసాస-దాద్దపాప్ప-ధపగరిస—2సార్లు
రిసా-దపదరీసా-దపదపదరీసా-సా-దపగరిస—3సార్లు
సాదపదపగరి-గారిసరిగపద—4 సార్లు పైకాలం

సం - గా -

(సంధి-యీ సీసపద్యాన్ని-సూత్రదారి అభినయించుచుండ
నర్తకి-హావభావాలతో-వయ్యారంగా-నడయాడాలి.
యిది నాట్యాలంకారం-యితడే మాష్టరుకూడాను)

సీ॥ శివపూజ నాసక్తి – జిన్నిచన్నులు పెక్కు
వయు – బ్రత్యూహంబు నయముజూప
శైవాగమాంతర జ్ఞానంబు – దనులతా
ప్రభయు నంతంతకు - నభినయముగ
పార్వతీ ప్రాణేశ – భక్తియు గూకట్లు
వెలసినానాటికి వృద్ధిబొంద
వారకులాచార – వాసనాబాల్యంబు
లోకపూట-కొకపూట-లుడిగిపోవ

గీ॥ శాంభవంబైన తేజంబు – శైశవాప
గమ-వయోగణ్య-లావణ్య గౌరవంబు
హృదయమున – నంగకంబులనుదయమొదవ
జరువబోవుదురిరువురు – మదవతులును ॥

శ్లో॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః
తాంతకిట - తాంతకిటతో
తైతకట - తైతకిటతో
తఝుంతతో – తదీద్దితో
దిన్నాకిటతకతై – శిపార్లు

శ్లో॥ ఏకాశ్యంతు – చతుర్భుజం-త్రినయనం
వామేతు దుష్టూరగం
చంద్రం – పత్ర-శిఖిప్రసారితకరం
ఊర్ధ్వం పదంపంచితం

సర్వే స్వస్తికమండలం - డమరుకం
గంగేజటేబిభ్రతం
వందే కీర్ణజటాన్నపేశః
అనిశాపస్మారదేహేసిఃతం ॥

## కౌతం మేళకర్త-చిదంబరకౌతం-బ్రహ్మతాళం

తద్దింత–ధీంధీంత–శంభోమునిజన
సకల సురాసుర – సన్నుతపాదా
కింకిణీ ఝుం ఝుం–ఝుణ–ఝుణ–ఝుణ–ఝుణ
నూపురలయగతు-ఘణఘణ–ఘణ–ఘణ
విధిహరిసేవిత–తక్కుడు–ధిక్కుడు – దరికిటకిటతక
తాంతతాం_తక్కిటకిటతక-ధరికిట-కిటతక
తాండవినోదా_ధిక్కిటకిటతక_ధరికిటకిటతక
వ్యాఘ్రమ శంకర–తొంగిటకిటతక_దినకిటకిటతక
త్రిశూలహస్తా_నంగిటకిటతక_ననకిటకిటతక
నందివాహనా - ననాదయోగా-
జగణం కిటతక - తగణం కిటతక
దిగిదిగి-తద్దిక్కత్తొ–తధిక్కు
తధిక్కు–జయజయ-శశిరవిభూషణ
రూపభయంకర – ధమరుకహస్తా
తృతీయసహస్ర దీక్షితాపాదా
నటరాజకవుతం - తాక్కు-
ధీక్కు–తక్కిట-తొంగిటకిటతక
ధే..ణ-తంఘిక్కిటతక-ధిక్కిత్త

(మరల గురుపాదాభివందనంచేసి యింటికి వెళ్లుదురు)

## శివార్చన - హిందోళ - ఆది

పూజలు సేయుదమా-
పురుషోత్తముడని వేడుదమా ॥పూ॥

అ॥ప॥ భవుడేమాకిక ప్రాణ విభుండని
శివార్చనలు - లక్షవ్రత విధులను ॥పూ॥

### బుద్రలయలు

ఓ నమో భగవతే బుద్రాయా నమోఅస్తు

1. సర్వోహ్యేష బుద్రనస్మై బుద్రాయ-నమోఅస్తు
2. పురుషోవై బుద్రన్మహో - నమోనమః-బుద్రాయా నమోఅస్తు
3. విశ్వం-భూతం-భువనం-చిత్రం-
బహుధాజాతం - జాతమానంచయత్
సర్వోహేష - బుద్రనస్మై బుద్రాయ
నమోఅస్తు - బుద్రాయా - నమోఅస్తు

(డమరుక-డిండీతాండవం-దీనిలో-ఆశిప్ర త్యాశి-
వ్యత్యస్తం - మర్దితం-దిగిదిగీలు - అందంగా-
లాలిత్యంగాయుండాలి)

### బ్రహ్మతాళం-నాట్యమపధారయ

ధీంధీంతకధిమి-ధిమిత-ధిమితతక
ద్రుగుడుత - ద్రుగుడుత తక - తకిట తకిట తక
రాగదేమహేశా - రమ్ము జగదీశ ॥రాగ॥

1. తలపైజాహ్నవి తాండవింపగా
అలలమీద నెలబాలుడూగగా
గళమున ఫణిపతి - మిలమిల మెరయ
తళతళ-తళతళ-కళామూర్తివై ॥రాగదే॥

1. ఆననచుంబి తైదవ సకల సుమనస్ఫురితలతిగా - ఋద్రాయా నమోఅస్తు.

2. కృతఐటంటం నినాద - వినోదసాధకహస్త భాస్వరా - ఋద్రాయా నమోఅస్తు.

3. డమరుకం - కంజహూతే - రత్నముఖేన-కృత్యభూషణా - ... రాయా నమోఅస్తు.

4. తంతం - తండుచేతసి భక్తిభాసిని- మస్తకోపరీ - ఋద్రాయా నమోఅస్తు.

5. విధృత గంగం - గమ్యమాన - మనాదిపచనైకంతరీకకరీ - ఋద్రాయా నమోఅస్తు.

6. మునివశం - శంశం సనీయతసుం-విలోచన దహనభస్మిత-ఋద్రాయా నమోఅస్తు.

7. మదనచంచం - చంచరీకిత - సకలసురవీర - హృదతవదముగా - ఋద్రాయా నమోఅస్తు.

8. నరసిజం - జంజన్యమానోదయం - భవంతమిహాశ్రయా - ఋద్రాయా నమోఅస్తు.

శివాయ శంభురూపాయ శివరూపాయ శంభవే

ఓన్నమో భగవతే ఋద్రాయా - నమోఅస్తు.

## జంపెతాళము - చాపు

1. తాద్రుగుడుజనగజం - తధిమితతా
తత్ద్రుగుడుజం - నగజం - తధిమితతా
తధిమితతా - తధిమిత - తధిమితతా
తధిమిత - తత్కిటతక దరిగిణతోం

2. కేలశూలముబూని - బాలలోనడుపగా
నందివాహనముపై - ఆనందమూర్తివై
రావయ్య - గౌరాంగ - రమ్యంధకారీ
శమ్మోపరంతపా - జ్యోతిన్వరూపా ॥

తాకిటతక-డెగిడెగ-తళంగుతోం
తత్త కిటతక - డెగడెగ — తళంగుతోం
తళంగుతోం - తళంగు తళంగుతోం
తళంగుతత కిటతక - దదిగిణతోం ॥
రావయ్య గౌరాంగ — రమ్మంధకారీ.........డమరుకనాదం

తల్లి :- కాంభోజి - ఆది

యేటికే మీకీ పూజలూ
నా-కూనలోర-కులమందారులార ॥యే॥

అను॥ యెన్నడు నేర్తురోకుల వృత్తులనుచు
వేచిచూచితిని అనుదినంబునను ॥యే॥

1. శివుడు బ్రతికించునే - మనల
బిబ్బోకంబుల బెదిరింపులగనరె
అబ్బబ్బా — విరిశరుపాతము
నిబ్బరముగనేర్వ రేమరువక ॥యే॥

సీ॥ రసికులుమీగానరసమానవచ్చిరి
పాడరే శివభక్తి పాడుగాను
జాణలు మీవిలాసము జూడవచ్చిరి
చూడరే-శివభక్తి చూరవోను
వల్లవుల్ మీతోడ భాషింపవచ్చిరి
పలుకరే శివభక్తి పారిపోను
పార్థివుల్ సకలసంపద లీయవచ్చిరి
పిలువరే శివభక్తి పెంపుచెడను

గీ॥ ధనము గల్గిన జంగమార్చన మొనర్ప
శివునకఖిలోపచారముల్ చేయవచ్చు
వనజ ముఖులార - నాసరి వారిలోన
శిరులు మెరయుచు - దలయెత్తి తిరుగవచ్చు ॥

## నాదనామక్రియ - ఆది

వినలేము-వినలేము బోధలా ॥విన॥

అ॥ప॥ కలకాలమాభవుడె - చూడాలి మాకళను ॥విన॥

1. నవరసాలంకారి - శివుడే మావిభుడు
కవలమాతోపాడి - నాట్యాలతేలించు ॥విన॥

2. యెవడే-వాడెవడే - జాణకాడే
శివుడే చరణ చారణ-సూత్రధారీ మేటి ॥విన॥

3. పార్థివులా - సత్ప్రధమీలేరు
భవుడే పార్థివుడు - సకల సంపదలిచ్చు ॥విన॥

4. వల్లవులు కల్లరీలు-భాషింపన్
భవభయహరుడే - వరదుడు మాకింక ॥విన॥

సీ॥ శివునపేక్షించిన చిత్తంబు - చిత్తజా
యత్తమై - విటులపైనానవదునె
పరశివస్తుతికథా ధాషలు విను వీను
లానునెకుంటెన లాడుపలుకు
ఈశ్వరీశ్వరమూర్తి - నీక్షింపగోరెడు
చూపన్యరూపంబు - జూడజనునె
ముక్తివల్లభు - ననురక్తి గూడదలంచు
కాయంబుగూడునే కాముకులను

గీ॥ హరుని భవహరు-శ్రీకాళహస్తి నిలయు
వినుతి యొనరించు-జిహ్వైక-మనుజతతికి
ప్రియము జెప్పంగబోవునే నయముమీర
వారధర్మోపదేశమ్ము వలదుతల్లి ॥

క॥ మగువకు శరీరమొసగిన
మగడు-చిదంగనకు మగడు-మాయావతికిన్

మగడు - మగవేల్పులకురగు
మగడు - మగడుగాక - మాకుమనుజుడు మగడే ॥

మాణిక్యవల్లి :- అయ్యో. అయ్యో-అయ్యో-నాతల్లి
కమలా మనోహరిరాగం-ఆది

స గ మ ప ని స - స ని ప ప మ గ స
సొమ్మెల్లవమ్మాయెనే - సంపాదన ॥సొమ్మెల్ల॥

అ॥ప॥ చెడబుట్టిరే - ఉపకారములజేయ ॥సొమ్మె॥

1. గాజుల గలగలలు - బంగారు యుంగరాల్
బాజుబందులు వడ్డాణ - గంటల గణగణలు ॥సొమ్మెల్ల॥

2. ముంగెర అడ్డబాసలు - ముత్యాలసరాల్
కట్టకాసులు జిగినీలు - కరకంకణములు ॥సొమ్మెల్లవమ్మాయెనే॥

3. రవ్వల దుద్దులు - తాయిడిచంద్రులు
జడకట్టుకొప్పులు - గండపెండేరాలు ॥సొమ్మెల్ల॥

4. తూగుటూయలుత్ - పందిరిమంచాలు
పట్టుచీరలు - గుట్టురెవికలు
పెట్టిపెంచినసొమ్ము - పరులపాలై పోదే ॥సొమ్మె॥

5. పొదరిండ్ల వితర్దులు-పూచిన మల్లెమొల్లలు
యేమౌనకో-యింకేటికో-యివి యెవరికో ॥సొమ్మె॥

అక్కాయ్‌లోలాక్షి-వదినా సరసిరుహం-బిసేవ్‌పుష్పవతీ
కోడలా రమణీమణీ - ఓయిమగాళ్లూ

ఉ॥ ఏ నెరజాణలైన కమ
లేక్షణలన్ - మణిమంత్ర తంత్రవి
ద్యానవచాతురీ మహిమ
నైనను - మందులనైన - నీశ్వర
జ్ఞానము మాన్పి-కామసుఖ
సక్తులజేసిర్ధయేనిఖిత్తు - గా

సైనను పుచ్చుకోక - కమ
లాన్యల - కన్నెరికంబు వారికిన్ ॥

జంగాలు :- వస్తున్నాం - వస్తున్నాం-

క॥ శంభోశంకర సాంబా
అంబోజాక్షా—భంభం—అంఘ్రి—ఔషట్
దంభాలు రయోశంభో
పట్బం గడవర—రొంగల వైనము—సాంబా ॥

నీలాంబరి - ఆది

అ ఖ చ కై
స రి గ మ ప ద ప ని స - స ని ప మ గ రి గ స
ఓయి ఓయి జంగమా — ఓంకార లింగమా
నాణ్యమైన జంగమా - నా ప్రాణలింగమా ॥ఓయి॥

1. ఎతుకాలు గిత నెక్కి - అట్టె తిరుగు జంగమా
బిచ్చమెత్తు వాడవాడ - భీమశంకర లింగమా ॥ఓయి॥

2. భల్ల నారాయణకే ముద్దు — వట్టిలైన జంగమా
చల్లంగా పాలింపుమయ్యా — కోటిలింగమా ॥ఓయి॥

3. కాశిలో ప్రవాసమైన - విశ్వేశ్వర లింగమా
కావవయ్యా ద్రాక్షారామ-భీమేశలింగమా ॥ఓయి॥

4. వెండికొండమీదనుండు — కొండవీటి జంగమా
తోడునీడలె కూచిపూడిని — రామలింగమా ॥ఓయి॥

5. శ్రీశైల క్షేత్రమందు - శ్రీగిరి భ్రమరీ
నల్లమల అడవులలో చెమిటి - మల్లికార్జున లింగమా ॥ఓయి॥

6. శ్రీ—కాళహస్తి దక్షిణకాశీ — స్వర్ణముఖి తటినీవాన
(తక) శ్రీకాళహస్తి మూర్తి - వాయులింగమ—జంగమా ॥ఓయి॥

7. సేతుబంధన సైకతమూర్తి - ధనుష్కోటి తటినీవాన
సీతారామ స్థాపిత-ధూర్జటి-రామేశలింగమా ॥ఓయి॥

8. మహానంది జలోద్భవా కృతి-నల్లమల అటవీ నివాస
మహాబుద్రా ఛిద్రలింగమ - కామేశ్వరీ హృదయ జంగమ ॥

ఖండచాపు - ఘంటానాదం

1. పాడిపంటలతోటి ప్రభవిల్లి బ్రతకాలి
రారాహరహరాయోభవా
చిట్టిపాపలతోడ-శ్రీమీర చెలగాలి
రారా-లేరా-హరహరాశివా

2. ఆలుబిడ్డలమగలు - నూరేళ్ళ పంటతో
భోగమందాలి రారాభవా
తరతరాలుగవెలసి - మునిమనుమలెనసితా
శిరుల చెలగాలి - రారా శివా

3. ఆర్షేయ పౌర్షేయ మెలయించి ఆంధ్రికి
ఆంధ్రభాషాయోష వేరాభవా
ఆదిభాషాయోషలలరించి ఆంధ్రికి
నోములపంటగా రారా శివా

4. ఐంకారములతోడ - హ్రీంకార మెలయించి
శ్రీం కారముల పూజించరా భవా
నృత్యకేళీ దేల్చి సారస్వతము బూన్చి
సంగీతలహరిదేలించరాభవా

5. కూచిపూడీబాణి - నాట్యద్వాదశాంగాణి
సిద్ధేంద్రు నీ వాణి-చేకొందురాభవా
మేళకర్తలతోడ మేలమాడేచంద్ర
మౌళీ నృత్యాల నాదంగ రారా శివా

6. రామేశుడా–యో రామలింగేశుడా
భామా కలాపాల - బాలమ్మతోనాడి
పార్వతీశుని సూక్తి - లోకాలలోపాడి
పరిధవిల్లరసాంబ – శంభోశివా
శంభో-భగవతీ-శాంభవీ-కాత్యాయనీ-మాతా
భిక్షాందేహి–

పిల్లలు :- జంగమదేవరా-భుజంగ శశాంకుని-భజించు-వంచ
రీకమా - స్వాగతం

ఉ॥ యెచ్చటనుండి వచ్చితిరి
యిచ్చటి మా స్థితి గోచరించెనే
పొచ్చములేక చెప్పుడెటు
పోవుదురోనటు తీర్థసేవలన్
చెచ్చెర వెంట వచ్చెదము
శ్రీగిరి రంగము కాళహస్తికిన్
వెచ్చము దెచ్చుకొందుమిక
వెంటను వచ్చుట కిచ్చగింతురే

జంగం :- కందార్థం - చాపు

క॥ కొలచితి కేదారేశుని
కొలచితి విశ్వేశు గౌరికోమలి పదముల్
కొలచితి శ్రీరంగంబును
కొలచితి రామేశు దేవు కోరికలలరన్
ఇలగల శ్రీకాళహస్తి - పోవుదుమింకన్
తలిరుబోణులు వెంటరండిక
కలని క్షేత్రములెల్లచూతము
వలసినంత–ద్రవ్యమాదిగ–వెంట నిడికొని కదలిరారె
॥కోరికలలరన్॥

# శ్రీశైలం - ఉత్సవాలు

## ఫేరణీ తాండవం

శరభ-దదదద-శ్శరభ-అశ్శరభ-శరభ - 3సార్లు
(అంటూ స్టేజీలోకి రావాలి)

- స్రగ్ధర -

లోకానాహూయ సర్వాన్ - డమరుక నినదైః
ఘోర సంసారమగ్నాన్
దత్వాభీతిం దయాళుః ప్రణుతభయ
హరం-కుంచితం-పాదపద్మం
ఉధృత్యేజం-విముక్తేరయ నమితి-కరార్ధ
ర్మయ ప్రత్యయార్థం
బిభ్రద్వహ్నిం సభాయాం కలయతి నటనం
యస్సపాయాన్న పేశః

బుద్రలయలు - శరభలు

1. సర్వోహ్యేష బుద్రస్తస్మై బుద్రాయ-నమోఅస్తు
శరభ-దదదద-శ్శరభ
2. పురుషోవై బుద్రన్మహో-నమోనమః
శరభ-దదదద-శ్శరభ
3. విశ్వం-శరభ-భూతం-శరభ-భువనం-శరభ
చిత్రం-శరభ-బహుధాజాతం-దదదద శ్శరభ
4. జాయ మానం చయత్-అలలలల్లలా-శరభ-
5. సర్వోహ్యేష-బుద్రస్తస్మై బుద్రాయ-**పపపప-శరభ**

6. నమోఅస్తు-ఖఖఖఖఖఖ-శరభ

7. ఋద్రాయ-శరభ-నమోఅస్తు-దదదదశ్శరభ.శరభ

**చూర్ణిక**-(యీ చూర్ణిక అడునపుడు-శివరూపాలు పోజు లుగా-కరణాలు చూపాలి-పక్కవాడు 1 శరభలనాలి),

1. శ్రీమన్మహోత్తుంగ-కైలాస శైలేశ-వియత్కేశ యీశా శరభ-దదదద-శ్శరభ

2. విపద్వారనాశ-శరభ-మహామ్మేరుకోదండ-శరభ బ్రహాండభాండోదరా-దదదదశ్శరభా

3. వ్యాఘ్రచర్మాంబరా-శరభ-శ్రీకరా-శరభ-నీలకంఠా. శరభ-దదదదశ్శరభ

4. మహోత్కంఠ-శరభ-మారంగ శరభ-దైతేయభంగా-దదదదశ్శరభ

5. శుభాంగా-శరభ-దయాపాంగ-శరభ-శృంగిణీనాద యానా. దదదదశ్శరభ-ఖఖఖ-ఫఫఫ-శరభ

6. పరిజ్ఞానదానా-శరభ-హరాశూలపాణా దదదద - శ్శరభా

7. శర్వశర్వేశ-శరభ-నిర్వాణ సంత్రాణ-శరభ-భూతా త్మ-రుద్రాక్షమాలాధరా-దదదదశ్శరభ

8. నాగకేయూరహారా-శరభ-శచీజూట-పద్మాంగరాగాహరా-దదదదశ్శరభ

9. నాగకేయూరహారా-శరభ-శచీజూట పద్మాంగరాగా హరా దదదదశ్శరభ

10. శూలహస్తా-శరభ-ప్రశస్తా-శరభ-త్రినేత్రా-శరభ-త్రినేత్రా శరభ-ప్రసన్నా శ నంతాలకా-శంభ-నమస్తే-శరభ నమస్తే- శరభ-నమస్తే-శరభ-దదదదశ్శరభ-ఖఖఖ - ఫఫఫ

తరం :- సౌరాష్ట్ర ఆది-

శివశివ-భవభవ-శరణం మమ
భవతు సదాతవ-స్మరణం ।శివ॥

1. గంగాధర చంద్రచూడ-జగన్మంగళ సర్వలోకనీడ ॥శివ॥

2. కైలాసాచలవాసాశివ-కరపురహర దరహాస ॥శివ॥

3. భస్మోద్దూళితదేహా-శంభో-పరమపురుష వృషవాహ ॥శివ॥

4. పంచానన ఫణిహేషాశివ-పరమ పురుషమునివేష ॥శివ॥

5. ఆనంద నటన వినోదా-సచ్చితానంద విదళితఖేదా ॥శివ॥

6. నవ వ్యాకరణ స్వభావ-నారాయణ తీర్థదేవ ॥శివ॥
తక్కిటకిటతక-దిక్కిటకిటతక-తాండవినోది
దిక్కిటకిటతక-ధరికిటకిటతక-త్రిశూలడమరు
ధిమిత-ధిమితధిమి-త్రినేత్ర శంకర
త్రిపుర సంహరా-ద్రుగుడు-ద్రుగుడు-ద్రుగుడుదాం
నందివాహనా-నాగభూషణా
టేకుకు-టెకకుకు-టెకకుకు ఢింకుకు
పార్వతి రమణా-భక్తవత్సలా
పరమ పురుష గంగాధర శంకర
తక్కిటకిటతక-ధిక్కిటకిటతక-తాకిణ ఝేకిణతక
ముగురురాజుల పూజలింగమా
మల్లికార్జున-నెల్లోహత్తా
తక్కిటకిటతక-ధిక్కిటకిటతక-తొంగిట కిటతక
నంగిట కిటతక-తాక్కు ధీక్కు-తక్కిట-
తొంగిట కిటతక-ధే..ణ.త్రం ఘిక్కిటతక-ధిక్కిత.

సంధి :- (యీ సంధీసదా[illegible]
తుంటే-అమ్మాయిలు హా[illegible]

సీ॥ కుట్టిన చంగావి గుడ్డల మొలగట్టి
లొంకపుతాక్షు తాటంకములు
వివిధవస్త్రచ్ఛేద విరచితకంథలు
భూత విభూతి-త్రిపుండ్రకములు
కర మూలముల వ్రేలు-కప్పెరల్ [illegible]
భద్రరుద్రాక్ష నైవక్త్యములును
శివసూత్ర బంధభాసిత కంఠలింగముల్
కుట్టిన కురుమాపు పుట్టములును

గీ॥ జిగురుడాకేల-భసిత-భస్త్రికలు [illegible]
దొంగ జంగము తెలయింప జంగమాంగ
నా విలాసంబు గైకొని-నళినముఖులు
కాళహస్తీశు దర్శించు కాంక్షదగిలి

భైరవి-రూపకతాళ[illegible]

నడచిపోదాము రారే మనము
నలువురమూగూడి శ్రీరంగం ॥నడ॥

అ॥ప॥ పుడమి పురమ తల్లియనగ
పొగడందే... శ్రీరంగం ॥నడచి॥

1. హరిహరరూపం శ్రీరంగనాథం
ముక్తి కాంతం-లక్ష్మీకాంతం
యెగుడు దిగుడు నడకలా
తడబడదురదేలా
యెగనామాలే పీకిక
యీరాతిరి అటోయిటో ॥నడచి॥

2. పులోరా-దద్దోజనం
నిదురింపా-ఆ సత్రం
మూటాముల్లా జాగ్రత
హుష్కాకీ-మీకూ మాకు ॥నడచు॥

పిల్లలు :- హరిహరేబ్యో న్నమః శ్రీరంగనాధాయ నమః

గుడి-శ్లో॥ వ్యత్యస్త పాదమవతంసితబర్హి బర్హం
సాచీకృతానన-నివేసితవేణురంధ్రం
తేజః పరంపర - మకారుణికం పురస్తాత్
ప్రాణప్రయాణ సమయే మమ సన్నిధత్తాం ॥

శ్లో॥ కస్తూరీ తిలకం లలాటఫలకే-వక్ష స్థలేకౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుంకరే కంకణం
సర్వాంగే హరిచందనంచ కలయం-కంఠేచ ముక్తావళిః
గోపస్త్రీ పరివేష్టితో విజయతే-గోపాల చూడామణి

రచన :- సంసీనయ్యగారు - కురంజిరాగం-ఆది

కా చ అ ఖ చ
స ని స రి గ మ ప ద - దపమగరిసనిస

తకిట- శివదీక్షా... పరురాలనురా..అఅఅఅ-అఅదే
శీలమింతైన విడువ-జాలనురా అఅఅఅ ॥శివ॥

అ॥వ॥ శివశివగురు నాజ్ఞ మీరనురా....
శ్రీవైష్ణవుడంటే-చేరనురా... ॥శివ॥

1. వడిగావచ్చి మఠము-జొరవకురా....
శివార్చనవేళ-తలుపు తెరవకురా
ముడువకావిచరగు-దీయకురా....నీవు
మాటి మాటికి-నోరుముయ్యకురా .... ॥శివ॥

2. పంచాక్షరీ జప.శీలనురా....
కూకి పలుకులను-వినజాలనురా....

కొంచపు వగలునే - నెంచనురా....
మ్రొక్కుదు - రుద్రాక్షసరులు తెంచకురా....॥శివ॥

3. అజ్జజూచి వక్షము నంటకురా....నా
సెజ్జ గొలుసుబట్టి - కదియకురా....
బుజ్జగించను - పసిగోలనురా....
కెమ్మోవినొక్కకు—భక్తురాలనురా ॥శివ॥

4. మోము మోమూబట్టి - చేర్చకురా... నీ
నామము తోరబూది - గూర్చకురా....
వేమరుతొడ భిక్ష - వేడకురా....
బోపోరమన్నారు రంగ - మల్లాడకురా....॥శివ॥

సంధి :- గీ॥ ప్రొద్దు గ్రుంకగ శ్రీరంగపురికి జేరి
స్వామి కొలువు నాట్యంబాడె-స్వాంతమలర
నిదురకన్నుల నలమంగ—నిదురచెంద
జంగముల్ మూటముల్లెల దొంగిలింప

(శ్రీరంగం గుడిలో నాట్యం కాగానే- సత్రానికి వస్తారు-రాత్రి అదమరచి నిద్రింప-దొంగజంగాలు-పిల్లల నగలు - డబ్బు మెళ్ళోవితెంచి లాక్కొనుటకు ప్రయత్నం చేస్తుంటారు- పెనుగులాట— మూకీ డాన్సులో ఆడాలి- ఆరాధ్య బ్రాహ్మణుడుగా-శ్రీకాళహస్తీశ్వరుడు వచ్చి - దొంగలను చితకబాది — పారద్రోలును - నేనేదో పాటరాస్తే బాగుండదు. టీడియస్‌గా యుంటుంది-మీ తెలివితేటలు Direction జూపండి. అమ్మాయిలు-యేడ్పు పెడబొబ్బలు — యిది కీర్తనగాదు మాటలు కీర్తనగా - ఆక్రోశించాలి- ముఖారి రాగంలో)

## ముఖారి

కావగరావే కాళహస్తీశ-
మోసకారులు బాధించిరయా
దిక్కెవ్వరు లేరురా- యెటులరా

బిరబిర రారా-విముక్తుల జేయరా
జ్ఞాన ప్రసూనా పంపలేమీ వారిని
ఆలసించకోయయ్యా మహేశా
పరేశా-సర్వేశా-శ్రీకాళహస్తీశా

(దెబ్బలు తిని దొంగజంగాలు పారిపోతారు- కాపాడినందుకు కృతజ్ఞతలు అభినయించాలి- ఆరాధ్య బ్రాహ్మణ రూపంతో శ్రీ కాళహస్తి గుడికి తీసుక వస్తాడు. గుడిలో ఆడిస్తాడు.)

## శ్రీకాళహస్తి దేవాలయంలో నాట్య ప్రదర్శన-

శ్లో॥ నమో దేవాది దేవాయా
త్రినేత్రాయ మహాత్మనే
రక్తపింగళ నేత్రాయ
జటామకుట ధారిణే ॥

శ్లో॥ నమశ్శివాభ్యాం–నమయవ్వనాభ్యాం
పరస్పరాశ్లిష్టవ పుర్ధరాభ్యాం
నగేంద్రకన్యా—వృషకేతనాభ్యాం
నమోనమః శంకరాభ్యాం

శ్లో॥ ప్రభుస్త్వందీనానాంఖలు పరమబంధుః పశుపతే
ప్రముఖ్యోహం తేషామపి-కిముత బంధుత్వ మనయోః
త్వయైవక్షంతవ్యాః శివమదపరాధాశ్చ సకలాః
ప్రయత్నాత్కర్తవ్యం-మదవనమియం బంధుసరణిః

తాంతకిట-తాంతకిటతో-
తైతకిట - తైతకిటతో
తఝుంతతో - తదీద్దితో
దిన్నాకిట తకతై—3 సార్లు

1. అద్భుత విగ్రహ అమరాధీశ్వర
అగణి తగుణగణ–అమృతశివా
సాంబసదాశివ–సాంబసదాశివ
సాంబ సదాశివ–సాంబశివా

2. ఆనందామృత ఆశ్రిత రక్షక
ఆత్మానంద మహేశ శివా
ఇందుకళాధర–ఇంద్రాదిప్రియ
సుందరరూప సురేశ శివా

3. ఓంకార ప్రియ ఉరగ విభూషణ
హ్రీంకారాది మహేశ శివా
అంబరవాస-చిదంబర నాయక
తుంబురు నారద సేవ్యశివా

4. ఈశ-మురేశ-మహేశ జనప్రియ
కేశవ సేవిత-కీర్తి శివా
ఉరగాదిప్రియ-భూషణ శంకర
నరక వినాశ సురేశశివా

5. ఛత్ర కిరీట సుకుండల శోభిత
పుత్రప్రియ భువనేశ శివా
ఝుంకారాశ్రియ–భృంగిరిటప్రియ
ఓంకారేశ మహేశ శివా

6. డంబ వినాశన–డిండిమభూషణ
అంబరవాస చిదీశశివా
డం డం డమరుక–ధరణీ నిశ్చల
ఢుండి వినాయక శేవ్య శివా ॥

ఆరాధ్యుడుగా పిల్లలను ఆడిస్తాడు - ఫేరణీరాసంగా యుండాలి- మధ్యల
తాను శివకిరీటం పెట్టుకుని- కలసి ఆడాలి. సుషిప్త్యావస్థలో పిల్లలు మోకరిల్ల
శివ వేషాన్ని ఆలింగనం చేసుకుని తన్మయత్వంలో – హారతి పట్టుకుని- యో

బదరగా - నిశ్చేష్టులగుదురు - జ్యోతి స్వరూపంగా శివునిలో లీనమగుదురు- ప్రత్యేకం-జతివద్దు- యీ కీర్తన తాళగతి లయారూపంతోనే- యెన్నో విధాలుగా ఆడవచ్చు. ఆకర్షణీయంగా యుండాలి- చక్కటి కిరణాలు పట్టండి-

## తిశ్రగతి-బేహాగ్-ఆది

శ్రీ శివశంకర గిరిజాధీశ మంగళం
శిష్ట జనాధార పంచశీర్ష మంగళం

1. అంధకదను జోత్తమాంగ హరణ మంగళం
సింధు గంభీర మేరు ధీర మంగళం ॥శ్రీ॥

2. సచ్చిదానందరూప శర్వమంగళం
కుచిత జనదమనపాప-కుహక మంగళం ॥శ్రీ॥

3. సుమనస ఘనవంద్య మౌనిస్తుత్య మంగళం
సుమనస శరహరణ భక్త సులభ మంగళం ॥శ్రీ॥

4. కుటిలదనుజ పటలవనకుఠార మంగళం
నిటులనయన భద్రవట-తటనిలయ మంగళం ॥శ్రీ॥

5. దనుజ శుష్కవిపిన దావ దహన మంగళం
వనధి తూణీభద్ర వటనివాస మంగళం ॥శ్రీ॥

6. వరద కూచిపూడి పురనివాస మంగళం
పరమ పురుష భవనిచయవిపాల మంగళం ॥శ్రీ॥

తోత్తో దిగిదిగి-దాత్తాం దదిగిణతోం
తాంద దిగిణతోం-తెద దిగిణతోం

## -: గద్యము :-

శ్రీరామేశ - రామలింగేశ - సిద్ధేంద్రసేవిత - లలిత
కళాక్షేత్ర - కూచిపూడీ నివాస - హరితసగోత్ర
సౌభాగ్యవతీ - వేంకటాచలపతి యజ్వా - కళాతపసి
పుత్ర - వేదాంత వంశతిలక - నృత్య వాచస్పతీ
పార్వతీశ ప్రణీతంబగు - నృత్యకావ్యం - ధూర్జటీ
కలాపం - కూచిపూడి మేళకర్త ల వినియోగములను
అష్టోత్తర కరణజతులు - చతుర్దశ జ్యోతిర్లింగ
కరణావతారములు - చతుర్దశ జతిస్వరములు
ధూర్జటీ కలాపము - పేరణీ తాండవరాసములను
నృత్యరూపములు - సర్వము సంపూర్ణము.

## పేరణీరాసం

### ముఖారి - ఆటతాళం చాపు

శంభోరార - విడంబమదేరా - సాంబారార ॥శంభో॥

1. శుంభనిశుంభుల - జృంభమడచి - జగ
దంబను నేలిన - సాంబుడరార ॥శంభో॥

2. జడలో నెత్తిన గంగ - నడుమ చంద్రునియుంచి
మెడలో రుద్రాక్షలతో - పొడజూపరార ॥శంభో॥

3. జింకచర్మము - వ్యాఘ్రచేల త్రిశూలము
వామాంకమునయుమతోడ రార ॥శంభో॥

4. సుందరమై యున్న నందినెక్కియు నీవు
ఇందు ప్రమథులతోడ - ముందుకురార ॥శంభో॥

5. బాణుని వాకిట - బంటులై పడియుండి
బలరామకృష్ణుల బాధింపలేదా ॥శంభో॥

6. శుద్ధ స్ఫటికవర్ణ - సద్యోజాతమైన
ముద్దుమొగమా - నావద్దకు రారా ॥సాంబరారా॥

7. పతితుల పాలించే వ్రతముండెనా నీకు
సీతారామదాసుకు-పతి నీవెకావా ॥సాంబరార॥

8. ఇన్నాళ్లు నీకు నాకున్నాది పంచాయతి
పిన్న పెద్దలు నలుగురున్నారు లేరా ॥సాంబ॥

9. విమలమైన వేములవాడ గుళ్ళోను
అమరి యుంటివని - భ్రమసి నేనుంటి ॥సాంబ॥

10. ఇన్నాళ్లు నేను నీ - వెంటబడియున్న
కన్నెత్తి చూడవోయన్న రాజన్న ॥సాంబరార॥

## ముఖారి-ఆది

1. జయ రామేశ్వర పార్వతి రమణా
జయమాం పాలయ పార్వతి రమణా ॥జయ॥

2. వీబూది రుద్రా పార్వతి రమణా
ఈశ మహేశా-పార్వతి రమణా ॥జయ॥

3. నందివాహనా పార్వతి రమణా
నాగాభరణా పార్వతి రమణా ॥జయ॥

4. అష్టకపాలా పార్వతి రమణా
ఆదిమూలా పార్వతి రమణా ॥జయ॥

## తిశ్రనడక-ఆది-ముఖారి

1. రావోయి రావోయి జంగమా-నీవు
పోవోయి పోవోయి లింగమా ॥రావో॥

2. పెండ్లివారు వచ్చి-పెండ్లి జరిపింపుమని
విఘ్నరాజును వచ్చి-వేడికొన్నారయ్యా
పెళ్ళివారింటికి వెళ్లక కూర్చుండె
విఘ్నరాజునుబంపి-పెళ్ళి జరిపింపగా ॥రావో॥

3. బ్రహ్మతాళముబట్టె
వాణి వీణనుమీటె
నంధి మద్దిలజాటె
ప్రమధులు జుట్టె
కట్టుబొట్టును ధట్టి
తాండవము జేయంగ ॥రావోయి॥

## తిశ్రనడక-ఆధి-ముఖారి

ఏమయా స్వామి శివశివా-కైలాసవాసా ॥యేమ॥

అ॥ప॥ ఏమయా స్వామి నీకు-సొమ్ము లేమి లేకపోయె
పాములను ధరించు టేమి-పాపమోహర హరా ॥యే॥

2. వెఱ్ఱివాడవై తెగావు-వెండికొండ దొరవు నీవు
పుఱ్ఱలో భుజించ నీకేలనో హరహరా ॥యేమ॥

3. రాచకొడుకువలెను సకల-రాజసములు గలుగ నీకు
గోచిలేక తిరుగుటెందుకోసమో హరహరా ॥యే॥

4. పాటిగలిగినట్టి పరమ-పావనుండవైన నీకు
కాటివెంట తిరుగు టేమి-ఖర్మమో హరహరా ॥ఏమ॥

5. మూడు లోకములకు నీవు-మూలమైన స్వామి వయ్యు
కూటికిన్-తిరుప మెత్తుటేమి ఖర్మమో హరహరా ॥ఏమ॥

6. అల్లచామర్తి-లక్ష్మీనరసు నిన్ను వేడగాను
అరసి బ్రోవకుండుట-అన్యాయమో హరహరా ॥ఏమ॥

## ముఖారి-ఆటతాళం చాపు

ఏమి సేతురా లింగ-ఏమిసేతురా ॥ఏమి॥

అ॥ప॥ ఏమిసేతు నీ మతము-ఎవ్వరికి తెలియదాయె
పాదుకున్న పంచభూతము-లెల్ల జడల బంధించులింగ ॥ఏమి॥

1. రాతిలింగము దెబ్బ చేతిలో-పార్థివము చేయుదమంటె
కోతి మనసు పూజయాయె-చేతలెల్ల రోతలాయె ॥ఏమి॥

2. తుమ్మిపూలు దెచ్చినీకు-తృప్తిగా పూజింతమంటే
కొమ్మకొమ్మకు-కోటివేల-తుమ్మెదలంటావు సాంబ ॥ఏమి॥

3. గంగ తీర్థమ్ములు దెచ్చి-లింగపూజ చేతామంటే
గంగలోనే జలచరమ్ముల-యెంగిలంటున్నావు సాంబ ॥ఏమి॥

4. అచ్చనాపులపాలు దెచ్చి-అర్పితము చేయుదమంటే
పాలలోనే పసిలేగల-యెంగిలంటున్నావు సాంబ ॥ఏమి॥

5. ఆత్మలోనే నిన్నుదలచి-ఆత్మపూజలు చేదామంటే
ఆత్మలోనే సాక్షాత్కారము-రోతలంటున్నావు సాంబ ॥ఏమి॥

## ముఖారి-ఆది

మంగళహారతి మారశుభాంగ ॥మం॥

అ॥ప॥ భృంగీశ్వరసుత - భోగికలాపా ॥మం॥

1. ఆగమ పూజిత అగణితచరితా
యోగివరార్చిత - వేగమెరారా ॥మం॥

2. వరకృపాకర - బందరువాసా
గౌరీనాయక-గానవిలోలా ॥మం॥

3. మండితమణిమయ-కుండలాభరణా
చండరాక్షసాళి - ఖండనభీమా ॥మం॥

4. ధీరత మంగళాపుర వరలక్ష్మి
నారాయణమది - నమ్మినదేవా ॥మంగళ॥

ముఖారి - ఆది



నారాయణ-నారాయణ నన్నే
రీరున బ్రోచెదవూ ॥నారా॥

1. వేరె తారకులు లేరుగనుక నిను
దూరవలసె-బహుదూరము రారి
నారదసనకసనందన-నుతపద
వారిజాక్ష-వారిరుహోద్భజనక
మేరుధరాధర-ధీరసుథావన
భూరిదయా రఘుపుంగవ శ్రీమ ॥నారాయ॥



2. బాలుడ నీమది చాల మెప్పింపగ
జాలుదునాయింత - జాలముజేయ
కాలునిచేనగు బాధలకోర్వను
కనిపెట్టుము నీవాడను తండ్రి
పాలనయనుడును - నీమాయకులో
బడగ- మనుజుడను-యెంతటివాడను
చాలనమ్ముటలు నాదుపురాకృత
జన్మ భాగ్యమిదె యొక్కటి సుమతి ॥నా॥

3. మునులకు నీవే మోక్ష మొసంగిన
సామర్థ్యుడవని - చాలదలచితిని
ఘనమగు తత్వార్థముచే మోక్షము
గాంచి మెలంగె దరోవరాత్పర

అనుదినమును నిను - మనమున దలచెడి
ఘనులను కనుగొని - మనమున మురిసెద
వనరుహలోచన - నీచెంతనునే మును
జేరకచింతబడితిగాదె ॥నారాయణ॥

4. కరిప్రహ్లాద - విభీషణాదుల
మొరయాలించిన - దొరవీవెకావ
నరునకు సారథివై సైనికులను
బరిమార్చియు - భూభారముదుప వా
సురముని వందిత - దశముఖ మర్దన
కరుణాసాగర - కామితప్రదా
పరమపురుష నాగేశ్వర పోషక
భావనాతీత లోకసుందరా ॥నారాయణ॥

## కాంభోజి ఆది

కంటిమయ్య కైవల్యము - కన్నులనిండా
వింటిమయ్య ప్రణవాక్షరము - వీనులనిండా ॥కం॥

1. ఆకులేని మానుమీద - కాకియున్నది-
ఆ కాకి ముక్కులోనే - బంగారమున్నది
బంగారు తీగబోలిన - కొంగయున్నది
కొంగముక్కులోనే శివలింగమున్నది ॥కంటి॥

2. నూతిగట్టుమీద నొక్క - నాతియున్నది
ఆ నాతి నెత్తిమీద - పెద్ద కోతియున్నది
కోతి నెత్తిమీద వరంజ్యోతి యున్నది
జ్యోతి నడుమ స్థిరమై—సద్గురుమూర్తి యున్నది ॥కంటి॥

3. గుళ్ల రెంటినడుమ నక్క - గూయుచున్నది-ఆ
గుళ్లవద్ద మునలి దొకతె-కాచియున్నది
గుళ్ళు తెరచిచూడ ముక్తికాంత యున్నది
పళ్ళుబిగిచి యూగులాడుచు వేచియున్నది ॥కంటి॥

నాదనామక్రియ-అటతాళం చాపు

యాగహరణ - నిగమాగమార్చిత
పన్నగభూషణ-నమ్మితిరా
నందివాహనా నమ్మితిరా ॥యాగ॥

అ॥ప॥ నమ్మితి-నమ్మితి-నమ్మితిరా-నీ
నమ్మకమేమో దెల్పుమురా ॥యాగ॥

1. కంటికి-మింటికి-రెంటికి-నడుమ
ఘంటనాదము-తుదినంటియుంటివిరా ॥యాగ॥

2. యక్ష-సురశిక్ష-మునిపక్ష-నిటలాక్ష
అంక్షనికక్ష్య - త్రివిష్టప సంరక్ష ॥యా॥

3. శివలింగ-ధవళాంగ-బూచిలింగ-నీగంగ
అభంగ-తరంగ-శిగభృంగె నోలింగ ॥యాగ॥

4. రామలింగయ్య-మా మొరలెల్ల వినవయ్య
రాగ-విరాగ-సరాగమె-కానంగ ॥యాగ॥

ఆది

మట్టిది రాయిది బొమ్మా-నీ
మనసున దెలసికొమ్మా ॥మట్టి॥

అ॥ప॥ యెంచగ పంచభూతముల కలయిక
జీవరాని వేశ్వేర జననమట ॥మట్టి॥

1. మురికిదిరాయిది డొక్కా
మురువకురా వెతికుక్కా
సత్యము సత్యము - చావులు బ్రతుకులు
నిత్యముక్తుడవై నిర్మల మతిగని ॥మట్టి॥

2. ప్రపంచమంతా నిండి
పరమాత్ముడు నీ మదిలోనుండి
విపరీతంబగు విరూపాక్షమా
అపరాధీ-అపరాధీనేనని ॥మట్టి॥

3. నవద్వారంబుల పేటా
నిటలాక్షుడు నిలచినచోటా
సోహం బ్రహ్మగురు దేవాయని
చాటవె నీమది నిర్మలబాట ॥మట్టిది॥

## భైరవి-అటచాపు

పుయ్యవలె విభూతీమేన
వెయ్యవలె రుద్రాక్షగళాన
చెయ్యవలె శివుని పూజ
కుయ్యవలె ప్రణవాక్షరాన
యాగంటిలింగా
దీనిభావము నీకే దెలసే ॥పుయ్య॥

2. ఆకాశాన కుంటయుండె-ఆ
కుంటయెండి- పంటాబండె
కోసి కోసి కుప్పావేశె
కుప్పగాలి అప్పుదీరె
యాగంటిలింగ
దీనిభాపము నీకే దెలసె ॥పుయ్య।

3. ఆకాశాన పోయే చిలుకా
మూకజూచి కేకవేసె
మూక మూడు విధములాయే
మూడు మూళ్ళు తొమ్మిదియాయె
యాగంటిలింగ
దీనిభావము నీకే దెలసె ॥షృయ్య॥

ఖండచాపు

ఈ జన్మమిక దుర్లభమురా-జీవ
సౌజన్మ సాకార – సద్గురునిగనరా
॥నరజన్మమిక దుర్లభమురా

1. మూడారు వాకిళ్లు మూతలెయ్యన్నా
ముక్తి వాకిటనున్న - తలుపు తీయన్నా
తలుపుతీసితె అంబదర్శనంబన్న
దర్శించువాడె తాబ్రహ్మమోయన్న ॥ఈ॥

2. ఆరుకొండలమీద – అంబయున్నదన్న
అంబవలె దుర్గాంబ-ఆట్లాడునన్న
ఆట్లాటలోమంచి - అర్థమునదన్న
అర్థమెరిగినవాడు-హర శివుడోయన్న ॥ఈ॥

3. పంచాక్షరీ మంత్రపఠన చేయ్యన్నా
పఠనజేసితె అంబ పండిచ్చునన్న
పండుతింటే వాడు పట్నమేలన్న
పట్నమేలినవాడు పరబ్రహ్మమన్నా ॥ఈ జన్మ॥

మిశ్రచాపు

1. నిత్య ప్రవనన్న గురుడు వీడెరా–ఆ
ద్యంతములు నిండినాడురా ॥నిత్య॥

2. కొంతసేపైనా మనసు నిల్పరా—విశ్వ
మంతా పరిపూర్ణుడని దెల్పరా ॥నిత్య॥

3. అరకంటి చూపులో చూడరా
నీవరలేక శాంభవి గాంచరా ॥నిత్య॥

4. తాను నేనని భేదమేమిరా - తను
తానై యుండగ తత్వమేదిరా

5. జాజిపండు తిన్న చందమూ- రాజ
యోగానుభావానందము ॥నిత్య॥

## మిశ్రచాపు

అందరాదా అరటిపండు - అది
అందిపొందినవారి - కమృతమైయుండు ॥అం॥

1. చిట్టడవి పొట్టడవి - కారడవిలోపల
పెట్టింది ఒక యీగ - తేనెసోన
ఈగలన్నిగూడి — తాగిపొయ్యేటపుడు
తుట్టెతో ఒకమాట - చెప్పిపోయినవా
తానెవ్వరో - తనవారెవ్వరో
మాయ తనువుకు జీవుడు - తగులాటమటరో ॥

2. యిసుమంత వత్తివేసి — కొంత చమురుపోసి
దేశ ప్రఖ్యాతిగ — జ్యోతివెలిగే
వెలిగి-వెలిగితాను — మలగిపోయేటపుడు
ప్రెమితతో నొకమాట - చెప్పిపోయినదా
తానెవ్వరో తనవారెవ్వరో
మాయ తనువుకు జీవుడు-తగులాటమటరో ॥

## కరణములు

1. తలపుష్ప పుటము 2. వర్తితము 3. వలితోరుకము 4. అపవిద్ధము

5. సమనఖము 6. తీసము 7. స్వస్తిక రేచితము 8. మండల స్వస్తికము 9. నికుట్టకము 10. అర్ధనికుట్టకము 11. కటిచ్ఛిన్నము 12. అర్ధ రేచితము 13. వక్ష స్వస్తికము 14. ఉన్మత్తకము 15. స్వస్తికము 16. పృష్ఠ స్వస్తికము 17. దిక్స్వస్తికము 18. అలాతకము 19. కటీసమము 20. ఆక్షిప్త రేచితము 21. విక్షిప్తాక్షిప్తము 22. అర్ధ స్వస్తికము 23. అంచితము 24. భుజంగత్రాసితము 25. ఊర్ధ్వజానువు 26. నికుంచితము 27. మత్తల్లి 28. అర్ధమత్తల్లి 29. రేచికనికుట్టితము 30. పాదాపవిద్ధకము 31. వలితము 32. ఘూర్ణితము 33. లలితము 34. దండపక్షకము 35. భుజంగత్రస్త రేచితము 36. నూపురము 37. వైశాఖ రేచితము 38. భ్రమరకము 39. చతురము 40. భుజంగాంచితము 41. దండరేచితము 42. వృశ్చిక కుట్టితము 43. కటిభ్రాంతము 44. లతావృశ్చికము 45. ఛిన్నము 46. వృశ్చిక రేచితము 47. వృశ్చికము 48. వ్యంసితము 49. పార్శ్వనికుట్టకము 50. లలాట తిలకము 51. క్రాంతకము 52. కుంచితము 53. చక్రమండలము 54. ఉరోమండలము 55. ఆక్షిప్తము 56. తల విలాసితము 57. అర్గళము 58. విక్షిప్తము 59. ఆవర్తము 60. డోలాపాదకము 61. వివృత్తము 62. వినివృత్తము 63. పార్శ్వక్రాంతము 64. నిశుంభితము 65. విద్యుద్భ్రాంతము 66. అతిక్రాంతము 67. వివర్తితకము 68. గజక్రీడితకము 69. తల సంస్ఫోటితము 70. గరుడప్లుతకము 71. గండసూచి 72. పరివృత్తము 73. పార్శ్వజానువు 74. గృధ్రావలీనకము 75. సన్నతము 76. సూచి 77. అర్ధసూచి 78. సూచీవిద్ధము 79. అపక్రాంతము 80. మయూరలలితము 81. సర్పితము 82. దండపాదము 83. హరిణప్లుతము 84. ప్రేంఖోలితకము 85. నితంబము 86. స్ఖలితము 87. కరిహస్తము 88. ప్రసర్పితకము 89. శింహవిక్రీడితకము 90. శింహాకర్షితము 91. ఉద్వృత్తము 92. ఉపసృతకము 93. తలసంఘట్టితము 94. జనితము 95. అవహిత్థకము 96. నివేశము 97. ఏలకాక్రీడితము 98. ఊరూద్వృత్తము 99. మదస్ఖలితము 100. విష్ణుక్రాంతము 101. సంభ్రాంతము 102. విష్కంభము 103. ఉద్ఘట్టితము 104. వృషభక్రీడితము 105. లోలితము 106. నాగాపసర్పితము 107. శకటాస్యము 108. గంగావతరణము–

కమాచిరాగం - రూపకతాళం

శ్రీ- మోహినీపురానాథ ॥శ్రీఇఇ॥

అ॥వ॥ కౌమారీ ప్రాణనాథ ॥శ్రీ మో॥

1. కామారికరమృగధర - సోమసూర్యవహ్ని నయన
సామగానలోల శివా - వ్యోమకేశ మాంపాహి ॥శ్రీ మో॥

2. వికసిత పంకజవదనా - ప్రకటిత కైలాస సదన
అకలంక మానసయుగ - అంగజదమనా
ఖగరాజ తురగపూజిత - విగతకలుష విశ్వనాథ
అగణి తపావన సుచరిత - సకలవినుత సకలేశ్వర
సా... రిసనిద - సనిదప - నిదపమ - గమగా మపమా..
కో... రినవర - ములోసగె—దవనుచు- వినినీ పదనీ...
పదనిద - గమపదనిరిసా..— రిసని దదనిని - సరిసా
రజములె-గతియనుచునుసా..రెకును-దలచితినిక-రా
రిసనినీ - సనిరదా - నిదప - ససనిదపమ - గమపావమ
రహరమే-రుధరకో - రితిని - సురపతినుత- వరవెంకట
దానిససని - రిసానీద - సనీదపమ
దాసవరద-మొరాలించి-వరాలొనగు ॥శ్రీ మోహిని॥

మోహినీపురము-మోపిదేవి—దివితాలూకా

-సమీక్ష- స్వభాషితం

క॥ ఎందుసు కాలము నిజమని
పంద తనంబునను బుద్ధిబాయక ఘనులై
యెందాక బుద్ధి నేగడేదు
నెందాక జరింపవలయు నాత్మబలమునన్ ॥

గురుదేవులా రాశిరసావహించా - నేర్చినది- మభ్యపరచక- దాయకొనక-
షాం కేతికాన్ని ప్రచురిస్తున్నా. అభ్యాసం లేనివారికి శాస్త్రం విషంతో
సమానం- అట్టివారు నన్ను చలకనగా ప్రస్తావిస్తే- బుజ్జగింపులతో సమా
ధానమిస్తున్నా.

శ్లో॥ విద్యా దదాతివినయం - వినయా త్యాతిపాత్ర తాం
పాత్ర త్వాత్ ధనమాప్నోతి - ధనాద్ధర్మం తతః సుఖం ॥

విద్యాభ్యాసంద్వారా వినయం-దాని నుంచి పాత్రత తద్వారా ధనసంపత్తి
-దాని నుంచి ధర్మప్రవృత్తి సుఖానికి మార్గాలు-

ఏ వృత్తిలోనైనా విజయానికి ముందడుగు ఆ వృత్తిలో నీవు యిష్టమును యేర్పరచుకొనుట.

శ్లో॥ సద్విద్యా శక్యతే లబ్ధుం గురూణాముపదేశతః

విద్యార్థీ ! నా కూచిపూడి నృత్యానికి సప్త సూత్రాలు
తద్ధి-త్తోనం-కిటతక-ధిరిగణ-ధరికుం-ఝుం-హం-

మేళ కర్తయంటే కొన్ని శాస్త్రీయాంశాలకు మూలము ఆరోహణ-అవరోహణ క్రమంగల సప్తసూత్ర లక్షణం మేళకర్త యనబడును- భరతముని ప్రోక్తం- నాట్య ద్వాదశాంగాలు లక్షణమన్నది. భరత కల్పలతా మంజరి. కాబట్టి లక్షణ మనే మాటను- మేళకర్త అన్నాను-

భరతముని నాట్య ద్వాదశాంగాలు 12 అంటే కూచిపూడి మేళకర్తలు 14 అన్నారేమండీ యంటే- చాళియం 12వ మేళకర్త- గ్రీనాభేదాలు- కటిభేదాలు- foot work లకు ఆరోహణ-అవరోహణ క్రమంచూపక- నీ తెలివితేటలనుపయోగించమన్నాడు. అటులే 2వ మేళకర్త కౌతానికి- కితాంతం కౌతముచ్యతేయని- త్వరగా అనేపదాలను వాడి- దేవుళ్ళను పొగడి- తంఘిక్కిట తక- ధిక్కిత్తయని తిరికనిమ్మని - విద్యార్థిని పరీక్షించుటచే ఆడేవానికి కోపమెందుకని - నావినాట్య ద్వాదశాంగాలుబాబు-కడం రెంటికి నీ తెలివినుపయోగించి 14 అనుకోమన్నారు కాబట్టి - నా కూచిపూడికి మేళలు 14 అన్నా - కడం రెండు మేళకర్తలను పూరించా.

మేళకర్త లక్షణం foot work యేలాగుండునో చూపమని యడుగుటచే- ధూర్జటికలాపం- అంటే మేళకర్తలు వినియోగాలు- ముద్రించా-కరణాలకు మేళకర్తలక్షణంగా 108 జతులు వ్రాశా- 14 జ్యోతిర్లింగాలకు మేళకర్త లక్షణంగా 14 రకాలుగా శివలింగావతారాలు వ్రాశా- మేళకర్త లక్షణంగా 14 జతిస్వరాలు

వ్రాశా. ధూర్జటికలాపం మేళకర్త లక్షణంగా శ్రీకాళహస్తి మహాత్మ్యం వ్రాశా.
ధూర్జటి అంటే శివుడు - కరణాలు నటరాజు స్వరూపం కాబట్టి - ఫేరణీరానం
వ్రాశా. మరల మరల తెలియ జెప్పండీ యంటుంటే - యింకా యింకా వివరి
స్తునా-

1. కూచిపూడి నృత్యమునకు శాస్త్ర నిబంధనలున్నవని- అదే వ్యాకరణమని- నా ఆజన్మకళాసేవ పరిశోధనలలో కనుగొని వివరించుచున్నాను - కూచిపూడి మేళకర్తలకు - భరతకల్ప లతామంజరి నాట్యద్వాదశాంగాలు ఆధారం.

2. నామిత్రులు కొందరు నాట్యద్వాదశాంగాలు భరతకల్ప లతామంజరివి కదా నీ కూచిపూడి ఆధారం చూపమంటున్నారు.

3. సమాధానమిచ్చుచున్నాను- శ్రద్ధగా చదువుబాబు.
నృత్యానికి-తద్ది-త్తోసం-కిటతక-ధిరిగిణ-ధరికుం-ఝుం-హం-
అనిసప్త సూత్రాలు. యీ సప్తసూత్రాలకు ఆరోహణ
తళంగు తకధిమి-అవరోహణ-తకర దిగిణతోం

4. లక్షణ మననేమి ? ఆరోహణ-అవరోహణ-సప్తసూత్రాం కలయిక-లక్షణ మందురు- దీన్ని మేళకర్త యంటున్నా

5. కొన్ని లక్షణములు కలిగిన- నృత్త నృత్య విభాగములలో - ఒక్కొక్క లక్షణ క్రమానికి - నాట్య ద్వాదశాంగములు 1) పీఠిక 2) కౌతము 3) కూటమానం 4) కైయడు 5) తురుపు 6) కళాసిక 7) ప్రచుర 8) వసర 9) శబ్దము 10) మరాళ 11) కడకట్టు 12) చాళీయము 13) చారమానము 14) నక్షత్రములనునవి. భరతముని చూపిన - ఆరోహణ - అవరోహణ- క్రమాలతో- మక్కికి మక్కి 14 మేళకర్తల వినియోగాలు రచించా- భరతుడు తప్పైతే పార్వతీశుని కూడా విచారింపమంటున్నా. భరత మునినే తప్పిదము చేయగల సత్తాయుంటే ముందుకురా తమ్ముడూ- కూలంకషంగా అర్ధమగుటకై పలువిధాలుగా సమాధానమిచ్చుచున్నాను- శ్రద్ధగా పదిసార్లు చదువుబాబు

6. భరత కల్పలతామంజరి. నాట్య ద్వాదశాంగములన్నది.. కాని 14 లక్షణములుగలవిగా శ్లోకం చెప్పుచున్నది.

7. సంగీతమునకు కనకాంగి - హనుమత్తోడి - చక్రవాకం - హరికాంభోజి లాటివి 72 మేళకర్తలుగా పేర్లుగలిగినవిగా యుండి ఆయా మేళకర్త లక్షణాలతో వేంకటముఖి నిబంధనల నేర్పరచినాడు తన స్వంతపై చ్యంగా- శంకరాభరణమునకు - కింకరాభరణమని కనకాంగికి మరనకామ మని. పేర్లు పెట్టలేదు. ప్రథమంగా యే యే పేర్లున్నవో వానినే వాడి నాడు. అట్లులే నేనూ వాడుకున్నా.

8. అటులే నృత్యంలోకూడా భరతకల్పలతామంజరి - పీఠిక - కౌతం కదకట్టు అనే పేర్లుపెట్టి వాటి వాటి ఆరోహణ - అవరోహణ - క్రియాలతో 14 నాట్యాంగ లక్షణములుగా చూపించారు.

9. పేరుకు నాట్య ద్వాదశాంగాలన్నారు- foot work నకు చతుర్థశాంగము లుగా జూపినాడు - సప్తసూత్రాల నిబంధన నిచ్చినాడు. సంగీతంలో- సరిగమపదని- సనిదపమగరి- సప్తసూత్రాలు. నృత్యంలో-తధి-త్తోనం- కిటతక-ధిరిగిణ-ధరిగుం-ఝుం-హం- అని సప్తసూత్రాలు-

10. పీఠికయనే లక్షణకారిగల- ఆరోహణ-అవరోహణ క్రమం తదితరాలనాటి సల్లాందర్యులు- నృత్తాలు-నృత్తపాళీలు. జతిస్వరాలు- స్వరత్యాలలోపొందు పడియున్నవి. యిటులే అన్ని లక్షణాలను 14 మేళకర్తల- ఆరోహణ, అవరోహణ క్రమాలతో వేర్వేరచూపితిని-నృత్య తరంగిణి చదువుబాబు.

11. ఇటి లక్షణములు నా కూచిపూడి నృత్యసారస్వతమునకే అంటిపెట్టు కున్నవి గాబట్టి- అచ్చ తెలుగుమాటలతో యున్న సప్తసూత్రాలకు-కూచి పూడి నృత్యసారస్వతము - ఒప్పదలయైయున్నది కాబట్టి- నాట్య ద్వాద శాంగములు పీఠికలనుండినత్రము వరకూగల- లక్షణములను- కూచిపూడి మేళకర్తలని పేరుపెట్టుకున్నా-యిది నా జన్మహక్కు.

12. విమర్శకులారా! బాగా ఆలోచించండి - నా కూచిపూడినృత్య సారస్వ తాన్ని పదిసార్లు చదవండి. ముద్రించా బాబు.

13. వివిధ నృత్యభారతీ! ఆయా ప్రదేశాల- నృత్త-నృత్య లక్షణాన్ని ఆరో హణ-అవరోహణసప్తసూత్రాలతో- ఆయా భాషలలో చూపవమ్మా.

14. పలుభాషా కోవిదులారా ! మీమీ వాజ్మికూడా తమ్మి చూలికొమ్మయే. నంటున్నాయే ఖాదచిలుక అవాద పలుకనున్నట్లు-భరత కల్పలతామంజరి. నాట్య ద్వాదశాంగాలు- నానృత్య సారస్వతానికి—వ్యాకరణ సూత్రంగా సప్త సూత్రాల కలయిక — అయి యున్నది కాబట్టి- నాట్య ద్వాదశాంగ. చతుర్దశ మేళకర్తలను నా కూచిపూడి మేళకర్తలని జెకొడుతున్నా-

15. మిత్రుడా ! భరత కల్పలతా మంజరి ఆధారంగా- మేళకర్తలు తయారు. చేశారాయంటే- నాట్య ద్వాదశాంగాలేగా యంటున్నావు- వేరేపేర్లతో మేళకర్తలు తయారు చేశారాయంటే యిదంతా పార్వతీశం పైచ్యమంటు. న్నావు- వెంకటముఖి వేదకాలంనాటి సంస్కృత పేర్లుగల రాగాలను- వాటిలో యేవి జన్యమో గమనించి-కనకాంగిలాటి తెలుగు పేర్లతో మేళ కర్తలను చేశారు- కనకాంగికూడా ఒక్కరాగమే- అటులే పార్వతీశం. కూడా-భరత ప్రోక్తమైన నాట్యద్వాదశాంగాలను- పీఠిక-కౌతము- వసర యనే వాటినితరతరాల నృత్యాంశాల తార్కాణములతో మేళకర్తల తీర్చి దిద్దారు- యిది దైవప్రేరితం- వివిధ నృత్త- నృత్యవిభావరీ ! నీ నాట్యా. నికి మేళకర్త లక్షణం చూపవయ్యా? సప్త సూత్రాలకు యేది సమ్మతమో. నర్తనలోకం నిర్ణయిస్తుంది- ఏదీ ముందుకురా తమ్ముడూ.

16. వివిధ భారతీసుతా ! తుదిమాట చెప్తున్నా-
భరత కల్పలతా మంజరి నాట్య ద్వాదశాంగాలు నా కూచిపూడి సప్త సూత్రాలకు- ఆరోహణ అవరోహణ క్రమాలకు- భరత శబ్దోచ్చారణలకు 15 శతాబ్దంనుండిగల ప్రతాపరాముని సల్లాం దర్వులయందు- జతిస్వరాలు. జతికట్లు-అర్దీలు- ముక్తాయిలు - తాండవాలయందు-నీరక్షీర న్యాయంగా తగియున్నవి కాబట్టి- లక్షణమంటే యిన్ని సూత్రాల కలయికగాబట్టి- ఇన్ని లక్షణములుగల ద్వాదశాంగముల పేర్లు - ప్రచుర-పీఠిక-కౌతము. లాటివిగా యున్నవి గాబట్టి- యీ పేర్లుగల లక్షణ స్వరూపాలు ఆరోహణ. వరోహణ క్రమాలకు పరిమితమైనవి కాబట్టి- మేళకర్తయను మాట. శమైన శాస్త్రీయాంశములు గలదిగాబట్టి- యీ నాట్య ద్వాదశాంగా ముద్దుగా మేళకర్తలని పేరుపెట్టుకున్నా - యిది నా జన్మహక్కని. మతి జెకొడుతున్నా-

యే దేశమేగినా - యెందుకాలిడిన
కూచిపూడి జయపతాక చేకొని
చేయెత్తి జైకొట్టుచిన్నోర
నా కోర్కె దీర్చరా బుల్లోడ-

వేదాన్తమ్ పార్వతీశమ్
నృత్య వాచస్పతి

## మిశ్రచాపు - కూచిపూడి

అంబా పరాకు దేవీ పరాకు-మమ్మేలుమా శారదాంబా పరాకు ॥అం॥

1. వాణీ పరాకు- గీర్వాణిపరాకు
   వాణీ చక్కని - నీలవేణిపరాకు ॥అంబ॥

2. అప్పనముగ వడపప్పు పానకములు
   దెచ్చితి ఒప్పులకుప్పా పరాకు ॥అంబ॥

3. ముగ్గురమ్మల బొమ్మ - కూచిపూడీకొమ్మ
   నృత్యవాణ్మి - బాలమ్మా పరాకు ॥అంబ॥

4. తకిటతాం - తాం-తాతెయ్య యనుచును
   తాండవమాడే - తరుణిపరాకు ॥అంబ॥

5. సిద్ధేంద్రయోగి శిక్షితే నృత్యకేశి
   శేముషీ కూచిపూడీ పరాకు ॥అంబ॥

# కూచిపూడి పతాకము

శేతగులాబి రంగుగుడ్డ - చెరకుగడ పదికణువులు
జడబిళ్ళలు 108 యుండాలి.



**పతాకవందనము**

హంసధ్వని-బ్రహ్మతాళము

**వందే-వందే-వందే-వాణీభవాని ॥వందే॥**

అ॥వ॥ వాణీభాషా యోషితగీర్వాణి
వీణా వినోదపాణి
....నటరాణి-కోకిలావాణి కూచిపూడిరాణి ॥వందే॥

1. కలకలలాడే కళాసౌధములు
విలసిత సౌరభయశః కాంతుల
సలలిత మానీ నృత్యగానముల
ఆలాపంబుల కాలవాలిమిదే ॥వందే॥

2. బాలా-సామగానలోలా
చతుర్విధాభినయ ఖేలా
రామలింగేశు భేలా
షోడశ కళవాల - కూచిపూడి బాల ॥వందే॥

3. అమ్మా-తమ్మి చూలికొమ్మా
నవరస నటనల బొమ్మా
అమ్మలమ్మలా దొడ్డమ్మా
భాషా కౌశలమిమ్మ జ్ఞానమ్మ ॥వందే॥

పతాకసృష్టి
రచన : పార్వతీశమ్

—:o:—

ముఖారిరాగం- బ్రహ్మతాళం

శ్రీ పశుపతిహిత-హైమవతీ-బ్రోవు భగవతీ
శ్రిత జనమతిహిత-శృతి వదనతయుగ
ధృతిదూలిత-శతధృతి పితృసోదరి ॥శ్రీపశుపతి॥

అ॥వ॥ శతపత్రనేత్రి - సముదరి పుణ్యయిత్రి
నీలాభ్రసుగాత్రి - పరమపవిత్రి ॥శ్రీపశు॥

1. నన్ను బ్రోవ నిప్పుడు దయరా లేదా
సమయముకాదా - నీమనసు కరుగదా
నన్ను బ్రోవరాదా - భేదమేలవాదా ॥శ్రీప॥

2. రామా-చతుర్దశ భువనాభిరామా
శ్రీరామపరతత్వనీమా-నిన్ను గొలతు-ముఖజితసోమా
నన్ను బ్రోవుకరుణాలలామా
శివము బ్రోయుమా-భయముదీర్పుమా-అభయమిమ్ముమా ॥

3. పాదములకు ప్రణమిల్లితి-పాపములనుదల ద్రుంచు-క
పాలధరునిమనోహారిణి-పావనచరిత-ఫాలలోచని
పాలనమొనరించుపరమపావని-బాలాత్రిపురసుందరిజనని ॥శ్రీ॥

4. విగతరాగ-వేగముగరాగ
జాగులేలముఖారి-రాగానురాగ ॥శ్రీపశు॥

5. రవ్వజేసినివ్వటిల్లజేసితివమ్మా
యేమి సేతునమ్మా
మవ్వంబున బ్రోవవమ్మ జననీ
మువ్వగోపాలగారపుబిగిని ॥శ్రీపశు॥

సరిమగరిసని-సరిగరిగనిద-సరిసనిదపమ
కరుణనుగనుమ- మనవిని వినుమ - త్వరగ మనుపుమ
దని దని పదపా — సనిరిసనిదప — మగరిమపనిద
దివి జనుత ఉమా - చలన సునయన - శశిజిత వదన
పమగరి సనిద — పదసరిమ - దసరిమప - సరిమపద
అశి పదమవని - అచలసుత - మునిసన్నుత — దురితహత ॥శ్రీపశు॥

రచన : బొక్కా రామబ్రహ్మంగారు 1885 సం॥
కూచిపూడి

* *